శ్రీ శారదాంబాయైనమః.

# దసరా పద్యములు.

బ్రహ్మశ్రీ గుడిపూడి పూర్ణయ్యకవిగారిచే రచియింపఁబడిన

# రక్తబీజాసురవధ.

యస్. హనుమంతరావుచే ప్రకటితము.



నుగ్గిరాల:

ప్రబోధినీముద్రణశాలయందు

వ. సిరెండనశాస్త్రిచే ముద్రితము.

1912.

శ్రీశారదాంబాయైనమః.

# దసరాపద్యములు.



యస్. హనుమంతరావుచేఁ బ్రకటితము.

దుగ్గిరాల:
ప్రబోధినీముద్రణశాలయందు
వ. నిరంజనశాస్త్రిచే ముద్రితము.
1912.

ఛరికాయు, గజ్జలందాలు ఘల్లు ఘల్లుమనగాను, బొజ్జమొల్లగ కథల హారం బుతోను, ముజ్జగంబుల దివ్య మూర్తివనగాను, గుజ్జువేల్పుల మిమ్ము గొల్లుమెప్పునను, పూజింతు మిమ్మెప్పుడు పుండరీకముల, జాజిపువ్వుల మంచి సంపెంగవిరుల।మరువంపు విరజాజి మల్లెకుసుమముల, నిరతంబు పూజింతు నెమ్మి వేడుకల। పానకము వుండ్రాళ్లు. తేనెయిడ్డెనలు, నూనె బూరెలు వడలు నువ్వుమండిగలు, నానుబాలూ నెయ్యి అతిరసంబులు ను, పూసి భక్షింపుమీ పాలుపుమీరగను, పిండివంటలు మరియు ప్రి యపఫలంబులును, దండిగా బెల్లంబు తగుపాయసమును,ఖండచక్కెరమం చి ఖజ్జాయములును, నిండుకొని భక్తితో నీకొసంగెదము, యీవిధం బుగమీకు యింపుగాపూజ, గావింతు ఘనవిఘ్నదేవ దేవేశ, జయా,

## సరస్వతీ దేవి స్తోత్రము.

భారతీమాంపాహి ప్రణుతగీర్వాణి। వారిజ నను రాణి వరనీలవేణి శారదశుకపాణిసముదపికవాణి।చారువీణాపాణిసైకతశ్రోణిజయజయతు శర్వాణి జయతు భద్రాణి। జయతుపల్లవపాణి జయతు అలివేణి।జయతు పల్లవపాణి జయభద్రవేణి।జయతుపుస్తకపాణిజయనీలవేణి।నీలనీరదవేణి నిత్యకల్యాణి।నరసముగ నినుగొల్తుసద్గుణకదంబ।శిరులిచ్చి మమ్మేలు శ్రీ శారదాంబ॥ జయావిజైభవా। దిగ్విజైభవా॥

నాణెముగనమరు వన్నెలముద్దుగుమ్మ।రాణించు సంగీతరసికవేణా. మ్మ।అణిముత్యపురాణి అపరంజిబొమ్మ॥ వాణి నావాక్కున వసియింపవ మ్మ।తగినవిద్యలుచాల దయచేయవమ్మ।భగవత్పదాంభోజ భక్తి మాకి మ్మ ముకురకాంతివిడంబ ముఖచంద్రబింబ।చేకూర్చు మాకోర్కె శ్రీశార దాంబ॥జయా॥

అంబ శశిబింబ జగదాంబ కనకాంబ,తుంబురునారదా స్తుతిశార దాంబ వాణి శర్వాణి గీర్వాణి అలివేణి, రాణించు బ్రహ్మపట్టపురాణి వాణి, కలికి కోకిలవాణి కపురంపుబొమ్మ బాలశారదదేవి భామమా యమ్మ॥ జయా॥

## శ్రీఈశ్వర స్తుతి

శ్రీ గౌరివల్లభా శ్రితజనాధార, నాగేంద్ర కేయూరనాగసంహార, పరమునీశ్వర చిత్త వనజాత భ్రమర, పరమపావనచిత్త భక్తమందార, కొండవిల్లుగబూని ఘోరరాక్షసుల, ఖండించి త్రిపురములుఘనకీర్తిగాంచి, అందముగ దుగ్గిరాల్పురని వేశ, ధరనుభక్తులపాలి దాతనాగేశ॥జ॥

శ్రీపార్వతీసంగచిహ్నితకురంగ, దీపితజతానంద దివ్యశుభ్రాంగ, కంజరా పురభంగకుధరజాతాంగ, కంజలోచనహృదయకలుషశతభృంగ, కోరిమిము వేడెదము గోపచతురంగ, ధీరతనుమము నేలు దీపాంతరంగ, యితర దైవముల మేమిక వేడబోము, నతతమును మిముమదినినెన్ను తించెదము, నీవె దైవంబని నెరనమ్మినాము, నీవెమాకభయంబునీకు మ్రొక్కెదము, పరగంగదుగ్గిరాల్పట్టణనివాస, శరణు హైమవతీశ శరణునాగేశ ॥జయా॥

## శ్రీపార్వతీదేవి స్తోత్రము.

అరవిందలోచన అయినపూబోణి, హరుని పట్టపురాణి అంబురూహపాణి, కరుణించురుద్రాణి ఘననీలవేణి, పల్లవామృదుపాణి పరమకళ్యాణి, తళుకు కన్నులకాంతి ధగధగను మెరయ, బెళుకుకన్నులకాటుకయు మేనుసొలయ, తిలకంబుచే చాల తీరైనయట్టి, మొలకనవ్వుల ముద్దుగులుకుచున్నట్టి, శరణుజొచ్చితి వరములిచ్చి నన్ను బ్రోవు, కరుణతో నాగేశురాణి వనుగావు ॥ జయా ॥

అమ్మమా విన్నపము లాలించవమ్మా, మముబ్రోవగదవమ్మ మముగన్నయమ్మ, త్రిమూర్తులకు ఆధారమైనవమ్మ, సామగానప్రియా శౌశ్రీపదమ్మా పరమ దక్షునికొమ్మ బంగారుబొమ్మ, మనసిజాహరుకొమ్మ మముగన్నయమ్మ, శిరులిమ్ము దుగ్గిపుర శ్రీపార్వతమ్మ ॥ జయా ॥

## శ్రీ వీ ర భ ద్రుని స్తోత్రము.

పటపట బ్రహ్మాండ భాండంబువగుల, నిటలాక్షుకోపంబు నిగుడించినట్లు, ఘుడియలోదక్షుణ్ణి ఖండించితౌర, చటులముగ దుగ్గిపుర శ్రీ

వీరభద్ర ॥జయా॥

ప్రసదాశివునకు చెలువమరబుట్టి, భాసిల్లు సంపదలు ప్రతిష్ఠ చేపట్టి, వాసిగా కడువీరకాసియునుగట్టి, హాసియించి దక్షుణ్ణి హతము గా గొట్టి, కావవే మమునురుల కరుణాసముద్ర, శిరులలర దుర్గిపుర శ్రీవీరభద్ర ॥ జయా ॥

## శ్రీవిష్ణుస్తోత్రము.

శ్రీ రాబ్ధికన్యతో చెలగివేడుకను, గౌరవంబున నురల్ ఘనతగా ల్వగను, యీరీతి దుర్గిపురి యింపుసొంపుగను, శౌరి వెలసితివయ్య గో పాలరాయ, శ్రీగజార్చితదేవ సింధుగంభీర, నీరాకయును నేను నెమ్మి వే డితిని, సారెకును దుర్గిపుర పంగీతలోల, తారకేశవరాయ రాజరాజేంద్ర ॥ జయా ॥

## కృష్ణలీల.

మంచిదాకృష్ణయిది మంచిదగునటర, మించుబోటులమీద బూ రదగునటర, మచ్చుమందులుజల్ల మనకుదగునటర, యిచ్ఛకంబులు జేసి యి లయింపరాకు దుందుడుకు సేయుకుర సంధ్యచీకటిని, నందనందననీకు వంద నము నేతు, సయ్యాట లాడేవు సమయంబుగాదు, నగుబాటు జేసేది న్యా యంబుగాదు, దధిపాలు వెన్నయును దాహామిచ్చెదను, దధిరావునరసింహా దానునిక ద్రోవ, దయజూచి రక్షించు దీనమందార, భళిర శ్రీదుర్గిపుర బాల కృష్ణమ్మ ॥జయ ॥

ఏమిరా! శ్రీకృష్ణయింతయాగడము, తగునటరయిదినీకు జగతిలోపల ము, రేపల్లెవాడలో గోపసుందరులు, వింతగాజెప్పెదరు నంతతమునా తో, గొల్లభామలతోను చెల్లాటలాడ, భామనీపయిటలో బంతున్నదె నుచు, పట్టుకుందునటంచు బలికినావటరా, నాముద్దు కృష్ణమ్మ నాచిన్న తనయ, నావేణుగోపాల నందసుకుమార, అనియిట్లు తల్లి తన్న దలిం చిపలుక, తల్లి ముందరనిలచి తానిట్లుపలికె, అమ్మరో వినవమ్మ అతివగోపె మ్మ, చిన్నవారలతోను చెలగి చెండ్లాడ, నాబంతి పోయెనే దానింటిలోకి బంతి తెమ్మని నేను బలుకగాజూచి, గోపస్త్రీలందరు గుంపులుగగూడి, నీ

బంతియొరుగము నిన్నరుగమనిరి, అనుచు కృష్ణుడుబలుక అతివగోపమ్మ
తిరులకొమరునిజూచిచెలగి తాబలికె, కాత్యాయనీదేవికరగిపూజింప, జలక్రీ
డలాడగావలనుగాజూచి, చెలగినలువలుతీసి చెట్లపైబెట్టి, యువతులుచీ
రలనుంచివావటగా, అతిదూర్తతనములిట్లగుటనీకగునా, నాముద్దుకృష్ణ
మ్మ నాచిన్నితనయా. నావేణుగోపాల నందనుకుమార, అనగతల్లికిబలి
కె నాచిన్నకృష్ణు, చెంగల్వకొలనులో చెలియలందరును, చదలరనమ్మ
లునగడ చెలగవారలను, జలక్రీడలాడగా జలజాక్షి యొకతె, కనుసైగచే
యుగా కదలివెళ్లితిని. ఇంతకన్నా నేను ఎరుగనోయమ్మ॥జయా॥

## దశావతారములు.

దివమునంపదలొసగు దివ్యావతార, ఘనచెన్నకేశవా కరుణావి
హార, మరుజనకమమునేలు మత్స్యావతార, గురుతుగా కృపజూపు కూ
ర్మావతార, వరదుడవుగావయ్య వరహావతార, శిశులకరుణించు నరశిం
హావతార, వసుమునసిరిగల్గు వామనావతార, రక్షించుమముపరశురా
మావతార, రాక్షసాంతక రఘురామావతార, పక్షివాహన బలభద్రా
వతార, క్రోవనేర్పినయట్టి బుద్ధావతార, కావవేమము వేద్య కలికావ
తార దేవేశ దుర్గిపురి దివ్యనగరేశ, శేవకులరక్షకా శ్రీచెన్నకేశా॥జ॥

## శ్రీలక్ష్మీదేవి స్తోత్రము

శ్రీలలోకాలసిన శ్రీలక్ష్మమ్మపాల సముద్రములోనప్రబలితివి
కొమ్మ, చెన్నకేశవురాణి చెలువు మాయమ్మవాలాయముగమాకువర
ములీవమ్మగరిమతోమామనవి గైకొనవెబాల, గౌరవంబున మమ్మకరు
ణించుచాల, కాపాడుదువుజనుల కనకంపుబొమ్మ కమలపంచకవల్లికాంత
మాయమ్మ॥జయా॥

## శ్రీఆంజనేయస్తోత్రము

జలధరునికృపను యంజనికిజన్మించి, ఫలమనుచు మింగితివి, భా
నుకబ్బించి. అలరామలక్ష్మణుల సద్భక్తిగాంచి, మీరితివి రావణుని మేటిసత్వ
మున, కోరితివి రామవిభు కొమరుపాదముల. భూరిభుజాబలమునను బూకను

లవి శోయ, మేరుగిరిసమకాయ ।శ్రీయాంజనేయ॥జయ॥

శ్రీరామభక్తుడని చెలగిలోకముల, కీరతను అంజనాదేవిగర్భమున, అరూఢిబుట్టితివి అతిసంభ్రమమున, శూరుడన బరగితివి సారదివిజయమున, పండనుచు భాస్కరుని పట్టమింగితివి, నిండుమనమున రవిని నింగినిల్పితివి, నరవిభో శ్రీరాము సంధిగూర్చితివి, హరిచేత వాలినటుహతము చేసితివి, పతియాజ్ఞచే రాము ప్రభుపుకార్యమును, హితవుచే కపిసేన హెచ్చరించుటకు, జతకూర్చినలుదెసల జాడదెచ్చుటకు, అతిరయంబునబంపునప్పుడు రామునకు, వందనము గావించి వరుసతోడుతను, పొందుగా దక్షిణాంబుధి చేరువునను, జాడజాడల పృథివితనయగనవలెను, నేడ్కలలరగ నీదు విక్రమంబొప్ప, అనుచువార్ధియుదాటి నక్షై హుంకించి, దనుజరావణుపురము సమ్ముఖముపొంది, రమణియైయున్న యా లంకిణివధించి, అమరారి పురమంత అవుడు శోధించి, జనకజను గనలేక చాల చింతించి, అనువుగా నట్టిముదలన్నియును గాంచి, వనగుహాక్షి నిగనక వచ్చి శోకించి, వనరుహాక్షిణియున్న వనము వేగాంచి, రామభజనలుసేయు రమణినటుమాచి, భూమిజయున్న యా భూరుహము కెక్కడాసి, రావణాసురునటుకు రాకగనిజూచి, కావరపు మాటలను కమలజను నేచి, అనువుగాదిదివేళ ననిచాలలోసి, భూలోకమాత శీతశోలాక్షిగనక, శోకలాప్పుచుప్రాణిక్రిందికినిజనక, ఓకపీశ్వరమీరుయెవ్వారోయనగ, జోకతోడుత రామభటుండననగ, ప్రాకటంబుగతనదుప్రాభవంబొసగు, రాకగనిసంతోషరగము నందముగ, చిలుకను రఘురామ క్షేమంబు నడుగా, వెలయుగా చెప్పితివి వేడ్కచే వినగా, అనవాలొసగితివి అవుడు మైథలికి, దానవాదము జూచ వననిపుడుబలికి, మానగావనములో మనవులినిజూచి, దీనులగువారిని తెలిసిమన్నించి, దనుజులను పెక్కండ్ర ధరణిపైగూల్చి, అక్షకాసురుదున్మించి అనుజుల విదల్చి, రక్షించి యాయింద్రజిత్తుచేజిక్కి, పుణ్యజనపతిగనుచు పొందుగనుప్పరిక్కి, గణ్యామునితలచకనుకట్ల నటుజిక్కి, వున్నదిదె మర్కటము యొనర నుతికెక్కి, యున్న నగ్నికి వెరచి నటునీవునక్కి, మూకరాక్షసులెల్ల, మొనసినాలమున, కోకలన్నియు జుట్టికొనుచు మేలమున, అనలంబు దరికొల్పి నంతలో దెచ్చి

ఘనమయిన లంకంతగాలగానిచ్చి, బలువుగా నడమి చల్లారనిచ్చి, లలి నొప్పశీతగని రమణితోవచ్చి, నాదరంబుగనిల్పి సాష్టాంగమనుచు, దం డంబు బెట్టగను ధరణిజయిమెచ్చి, భండనోద్దండుడిని ప్రవణునకుదెచ్చి లలితముగ యాసిరో రత్నమటునిచ్చి, సెలవొసగి దీవెనలుచాలగానిచ్చి త్వరితముగ జనమనెనను సర్వమొసగగను। నురువడిన నినుడు సొంపుమీ రగను,మునువుగా యాకడలి ముదముతోదాటి, కులమువారలకెల్ల కొ మరుగాసూటి, నసుదాగా రఘురాము నానందమొందె, రమణిగంటిని రాజ్యలక్ష్మిమిముజెంది, అని రత్నమిచ్చితివి అతిసంభ్రమంద, హనుమం త ధీమంత అతిశౌర్యవంత, ఇనకులము నిల్పితివి మహి కరుణావంత, యినసమానము పెరగితివిగదాయింత, ఘనతరము నీమహిమ గట్టిగానెం త, పని కైన నోపుదువు బాహుబలవంత, కరమొప్ప సుందరా కాండకథ యంత, పరగ మహార్ణవమి పద్యముగ కొంత, పలువుగాజెప్పితిని న్యా త్తిగానంత, కీర్తిమించగ యిాకృతి మిాకనంత, వరగుగ్గికాల్వర ఘనద యస్వాంత, వివరించి మమ్ముబ్రోవు నీరహనుమంత ॥ జయావిజైభవా ॥

సిల్లకాలువరీతి పెనువార్ధిదాటి, చాలువుగాలంకలో శ్రీరాముమేటి కల్లరక్కసిమూక ఖండిచమేటి, చలముతో మమ్ముబ్రోవు నిలబుధసహా య ॥ జయావిజైభవా దిగ్విజైభవా ॥

## దీవెనసద్యములు.

శ్రీమంతులై మహా శ్రేయములుగలిగి, భూమిలో వెలలేని భో గములుగలిగి, ధనధాన్యములుగలిగి ధర్మములుగలిగి, ఘనవస్తు గజతు రంగవ్రజముగలిగి। రాజసన్మానంబు రాజ్యంబుగలిగి, తేజంబు ప్రాభవా స్తోమంబుగిలిగి, అందలంబులుగలిగి ఆశికీర్తగలిగి, పొందుగా నవరత్న భూషణాల్ గలిగి, బంగారు మేడలును కరిఘులును గలిగి, శృంగారవధు లతో చెలువములుగలిగి, సతులతో హితంతో సౌఖ్యములుగలిగి,సుతు లతో నుతులతో శోభనాల్ గలిగి, గంధమాల్యాంబరా ఘ్రాణములు లిగి, బంధుజాలంబులు ప్రఖ్యాతిగలిగి, అన్నదమ్ములుమిాదు ఆయువులు గలగి. తనయులకు తనయులకు తనయులంగలిగి, మనములకుమనమలకు మనములుంగలిగి, పాడియును పంటయును బాగుగా గలిగి,గాడ్డినురభులు

లుమీకు ఘనముగా గలిగి, వన్నెవాసియుగలిగి వర్ధిల్లరయ్యా, సన్నుతా చారములు జరిగించరయ్య, శ్రీయెలమితోడుతను ప్రసిద్ధిగామీకు, ఆ యువును పుత్రపౌత్రాభివృద్ధిగాను, పసిబిడ్డలను మేము పలుమారుదివుగ పసివాడియున్నాము యెండవానలకు, అయ్యావారికిచాలు ఐదువరహాలు పిల్లవాండ్లకుచాలు పప్పుబెల్లాలు, పన్నుగా ఖర్జూరపండ్లయిదుశేర్లు, నా రికేళఫలాలు నూరైతెచాలు, శేవురా మాపురా మల్లిరమ్మనక, జాగు చూపులుచూచి చాలుపొమ్మనక, చేప్రాగ్గుదిప్పినా యివ్వవలెగనుక,ఎం త సేపుందుమూయింతదయ లేక,పప్పుబెల్లంబులు బాలురకునెల్ల, యిప్పిం చిపంపుడీ ఘనలరంజిల్ల ॥జయ॥

శ్రీరస్తు విజయస్తు చిరక్కీర్తిరస్తు, భూరి వైభవమస్తు పుత్రలా భస్తు. ఆరూఢిగామీకు ఐశ్వర్యమస్తు, కొడుకులును కోడండ్ర కొమ రొప్పగలిగి, వరుగులును పెండ్లిండ్లు వయసతో గలిగి, ఎడబడనిసంపదలు ఎప్పుడును గలిగి, పుడమి వర్ధిల్లుడీ పుణ్యాములుగలిగి, అల్లుండ్లు మానము లును అధికములుగలిగి, కొల్లలుగ ధనధాన్య కోట్లులుంగలిగి. శ్రీలక్ష్మి మీయింట చాలగు బంగారు, పూలపూజలుచేసిఫాలుపొందినారు, ఆశ్వ యుజ శుద్ధ మహానవమిమొదలు, శాస్త్రోతా శీర్వాద సత్యవాక్యముల, బాలలా దీవెనలు బ్రహ్మాదీవెనలు, కెల్లినైన శ్రీవిష్ణుదేవు దీవెనలు, శ్రీకరంబైనట్టి శివుని దీవెనలు, ప్రాకటంబుగ ఋషులు పలుకుదీవెనలు, వేదాది కోటలను వేష్టించిమియ్య, వేష్కవచ్చితి మివుడు విధానంబు గాను, వైయ్యాకులను మేము వేసరాలేదు, అయ్యావారికిచాలు ఐదువర హాలు, పిల్లవాండ్లకుచాలు పప్పుబెల్లాలు, పన్నుగా వకతూము పప్పైతె చాలు, మంచిబెల్లము నెయ్యి మాకు యిప్పించి, ఝణఝణత్కారము గ సాగసంపించు, విందుబియ్యముపప్పు విడియుంబులిచ్చి, పొందుగా వె య్యిచ్చి భోంచయ్యమనుచు, పెట్టెలోపేమంచి ప్రియమయినశాలు, ధ ట్టికనాయాలు లగటిపాగాలు, యిట్టేటివిప్పకను యిపుడురమ్మనక, యి ప్పుడే అయవారి కిప్పించవలెను, తప్పకను యిప్పుడే దయచేయవలెను దుష్టజనులను బ్రస్తుతించేది లేదు, లొట్టికష్టపువాళ్ని అడిగేది లేదు, పొసగ పినులోభులను పొగిడేది లేదు, సగిడివారముగాము తెగువతో నడుగపొ

## వైశ్యులపద్యములు.

కోటికిని పడిగెత్తి కోమట్లలోను నూటొక్కగోత్రమున నుతికెక్కె యగాను, హాటకోజ్వలరత్న హారములంగోను; పాటించిపేరుకీర్తి ప్రఖ్యాతిగాను, వున్నతము పెనుగొండ వైశ్యరాధేయు, సంగతిగవాల్మీక సద్ధర్మనిలయు॥ వసుధలో

వైశ్యులెందరు మహా వర్ణనలుగాను, శాశ్వతముభాస్కరాచార్యునీవతెను, నూటొక్క గోత్రాన నుతికెక్కయగాను, పాటిగాహెచ్చి తిరి భళిభళీయనగ, జయా॥

## కమ్మవారిమీది పద్యము.

అరివర్గముల గుండె లదరుసీధాక, తురగపంక్తుల బారద్రోలు నీమూక, కరిఘటల వుడిగొల్పు గరిమనివ్వగాక దరిమి గుంపులుసేయు తగుసీదులేక, వరబలంబులమర్మ భంగమీరాక, చిరకీర్తిజయులక్ష్మి చేకూరుగాక, ధర్మమార్గంబులు దలచితివిగాక, చేరవచ్చిన అర్థిజనులరక్షింప, కమ్మవంశమునందు ఘనుడవైపుట్టి, కరుణదలచితివార గాంభీర్యపురుష ॥ జయా ॥

## తురకలమీద పద్యములు.

సాహెబుమెహర్బాన్ సలిలతసలాము, ముష్ఫక్ కదర్దాన్ మోహావుసలాము, పక్కుపయిజురసాన బంనగుసలాము, ఆయానుపండత్తు జాహానహాన పండత్కురూపాయ హాంసుపుతాని, మటులాయసూచరు ఆ బీరులయిన; బాల్బలాహానబహుత్కుమీహాన, ఆషీసమాయదు మెహర్బానిహాన। పేరునమెహర్బాన్ పెంపుభావింప ॥ వసుధలో॥

మహార్ణవపుపద్యములు సతపూర్ణము.

శ్రీహయగ్రీవాయనమః

బ్రహ్మశ్రీ గుడిపూడి పూర్ణయ్యకవిగారిచే రచియింపఁబడిన

# రక్తబీజాసురవధ.

1. నందివాహనుని నతివచరిత్రము పొందుగవినరయ్యా
యీకథచందముగనరయ్యా, మదిసంగియములువిడునయ్యా
బృందారకవందితయాపార్వతి పరగ గాచునయ్యా
సాంబా పరగగాచునయ్యా.

2. శ్రీకరముగ గణనాథుని ముదమున్నచెలగుచు నుతియించి
శ్రీమద్వాణిని సేంచి, భూరివిభవభూతులదలచి
రక్తబీజుడనురాక్షసుచరితము రయమునవినుపింతుఁ
ఏతన్మహిమలువివరింతుఁ

3. రజితశైలమున రమ్యతరంబుగ భుజగభూషణుండు
కృష్ణాసుజనరక్షకుండు, సురలకుకల్పభూజుండు
రాజితముగ తనవామాంకంబున రమణియు చెలువొందెఁ
సాంబారమణియుచెలువొందెఁ

4. గాలువుడీరికహూర్పుంపగనప్పుడు కామునుగసుమకెల్ల
విలసితముగసుర లెల్లా; తమహృదయంబులురంజిల్లా
పలుకెలగుల పూజించినుతించిరి పరమసంతసమునా
సాంబాపరమసంతసమునా

5. వీరభద్రపణ్ములు లతిముదమున వింజామర లేయఁ
ప్రమధులు నూడిగముచు చేయఁ, భైరవుభతలంబును వేయఁ
ధీరుడైన నందీశ్వరుడప్పుడు మృదంగధ్వనిసేయఁ
సాంబామృదంగధ్వనిసేయఁ

6. సామంబునుశాంపుచు మహాకాళులు చప్పట్లనుగొట్టఁ
లెధ్వనిచెలగిమిన్నుముట్టఁ, సురలపాదంబులుబట్టఁ

ప్రేమతో భృంగీశ్వరు వేడ్క-తొ ప్రేరణములు ద్రొక్క-
సాంబా ప్రేరణములు ద్రొక్క-

7. చండీశ్వరుఁడును కనులపండువుగ చెలువు మెరయగాను
బరాబరులు నల్వగాను, సకల ప్రజలు చూడగాను
నిండు వేడుకతో నిట్టివిభవమున యిందుశేఖరుండు
సాంబా యిందుశేఖరుండు

8. కొలువు దీరికూర్చున్న కాలమున నలినసంభవుండూ
నమశాధిపుడు దండధరుడూ, వహ్ని యుపై వస్వాతు మొదలు
కలకలధ్వనులతో కలగి వేల్పులు కడు దుఃఖంబునను
సాంబా కడుదుఃఖంబునను

9. కొలకులనీరొలుకగను నిలింపులు వెలుపలి ద్వారమున
నిలచియుండిన దుఃఖమునా, మునిగియుమిక్కిలి ధైర్యమునా
కూతలు బెట్టుచు కుధరనిలయ యనికుందిన హృదయమునా
సాంబా కుందినహృదయమునా

10. కావుమయ్యసగుణమహిమ్న స్వాపకనగాచలచాపా
సాంబా కామవిజితరూపా, చంద్రకళాపమంజులాప
ప్రాపునీవెయనిదాపు జేరితిని చేపట్టియు బ్రోవు
సాంబా చేపట్టియు బ్రోవు

11. యనుచుబల్కు-యమరార్తరవంబును వినిశంకరుడపుడు
విస్మయమందుచు మరియందు, వేగమె చండీశ్వరుగనియు
వేల్పులదోడ్కొ-ని రమ్మనిబల్కె నువేదవేద్యుఁడపుడు
సాంబా వేదవేద్యుడపుడు

12. బెంకుపడియు వాకిటనిలచినసురతుండంబులజూచి
చండీశ్వరుడమరులజూచి, దండిగవారలదోడ్తెచ్చి
కుండలిభూషణుదండజేర్చి తాచండవిక్రముండు
సాంబా చండవిక్రముండు

13. కనులసీరు కాలువలై బరువుగ కరపుటములసాచి
తనువులువణకగతాజూచి, షాగజేసి వేల్పులవీక్షించి

జడవకుడనివృషభేంద్రగమనుడతిత్వరగనిట్టూనిరో
సాంబా త్వరగనిట్టులనిరో

14. గాసిలజేశినఖలుడెవండుమిము గదశివేల్పులారా
మిమ్ములగాచెదఘనులార, దుష్టునిద్రుంచెదసురలార
భాసురముగమదిలోపల దిగులును బాయుడు యీవేళ
సాంబా బాయుడుయీవేళ

15. యిత్తెరగున కరుణాకటాక్షుడై యీశ్వరుండు బలుక
దనుజునివిధమంతయుబాగా, చెల్వగదాడగిరిహరుమ్రోలా
నత్త్రిఋషిసత్తములు హర్షమునదీవించిరిచాలా.
సాంబా దీవించిరిచాలా

16. రక్తబీజుడనురాక్షసాధముడు రణకర్కశుడగుచు
తానతిశక్తివంతుడగుచు, యచ్చట జూచినతానగుచు
హెచ్చుగమము బాధింపదొడంగెను యెంతనిదెల్పెదము
సాంబా యెంతనిదెల్పెదము

17. రిక్తులమైమేమిప్పుడుసరగున రిచ్చపాటునొంది
ముక్తీశ్వర నీదరిజేరి, ముదమునభక్తితోపూజించి
భక్తపాలనాసక్తుడవనియనురక్తిగవేడితిమి
సాంబా రక్తిగవేడితిమి

18. శరణుజొచ్చితిమి అరమరసేయక కరుణజూడుమయ్యా
హరమీకృపగోరితిమయ్యా, పురహర వెరవుదీర్పుమయ్యా
కరిచర్మాంబరగరళకంఠ యాఖలునిద్రుంచుమయ్యా
సాంబా ఖలునిద్రుంచుమయ్యా

19. యీరీతిగ మొరబెట్టెడి యమరులమారహరుడుజూచి
వారలకనులనీరుదుడిచి, క్రూరుని ద్రుంచెదననిబల్కి
కూరిమితో కనుసన్నజేసె దా గౌరిని వీక్షించి
సాంబా గౌరిని వీక్షించి

20. పతియుజేయు కనుసన్నగనుంగొని పార్వతి తాలేచి
సమరమొనర్పగ మదిదలచి సరగున శక్తిసేన గూర్చి

ధృతిమతితో • మృగరాజు పైనతా త్వరగ నధిష్ఠించి
సాంబా త్వరగ నధిష్ఠించి

21. కలకలధ్వనులతో శత్రులగూడుక కరకంఠునిరాణి
చిలుకలకొలికి చిగురుబోణి, అలికులవేణి కీరవాణి,
కొలకుల నగ్నికణంబుల జిలుకగ కోపోద్రేకమున
సాంబా కోపోద్రేకమున

22. మృగపతి బొబ్బలు పెట్ట ధిక్కరులు మ్రొగ్గి ధరణివణకె
నగరంబులు ప్రతిరవంబులొసగె, అమరుల హృదయంబులుపొంగె
అగణితముగ దానవుల చిత్తములుకు కలంబునొందె
సాంబా కలకలంబునొందె

23 యీరీతిగ శైలజ శక్తులో యసురులపై దూసి
కూరిరుల ధరపై బడ వేచి, ఖడ్గంబునగొంతులు ద్రుంచి,
వారక శరణను సన్నుతించరులను వేడుకతో గాచి,
సాంబా వేడుకతో గాచి,

24. సురవిదారియగు రక్తబీజునితో శివురాణియుగాల్చి
దుర్మతి మూడరనుచు బల్కి, సరగున ఖడ్గముఝళిపించి,
దురమున వానితో నేమరాత్రముల దొడరిబోరెనపుడు.
సాంబా దొడరిబోరెనపుడు

25. సకలవిధంబుల సమరము జేయుచు సుకరంబుగవాని
గనిప్రక్కింపలేక బాని, శత్రునిలిబుకి రుధిరుజౌది
ప్రకటితముగ ఈదుష్టదానవునిబట్ మార్చుటయెట్లో
నశివునాజ్ఞ సేయుణ [illegible]

26 నెత్తురుబొట్లశేఖర పైదొరగినవ చరకోటి
కొత్తగబుట్టియునమడాసి, వస్తువు మొత్తంబుగగలసె
మస్తులున్న మరిపరాయి తీక ఈనునుజూసనులిపుడు
సాంబా మరునలిపుడు

27. అనియివ్విధమున పార్వతిమదిలోఘనముగ యోచించి
యొక్కయుపాయంబును నెంచి, యసురునిజాగజూచిగపిలచి

దుష్టునివధకైయిష్టముతో జానదుర్గరూపుదాల్చి
సాంబా దుర్గరూపుదాల్చి

28. రణరంగతలంబెల్లను పరగునరసనగాను జేసె
కణశోణితములెల్ల ద్రావెన్, కలుషునిశౌర్యహీనుజేసెన్
మలినచిత్తుడతిక్రూరుండగుచును ముద్గరములురువ్వెన్
సాంబా ముద్గరములురువ్వెన్

29 నవమిదినంబున నానిశాచరుడు ననుతెల్లను ద్రొక్కెన్
భువనిచేతిలో నజక్కెన్. పాపుడు జనియె శమనపురికిన్
దేవతలెల్లను పుష్పవృష్టియును వేమరుగురిపించెన్,
సాంబా వేమరుగురిపించెన్

30. అంతటగౌరియు నతిసంతసమున అమరులు సేవింప
కాంతుని చెంతనిలచి బాగా, ఘనబుధితతియు బాగడి వేగ
యిందువలన మహార్నవమియను యీభువియందు జెప్పబడియె
సాంబా భువియందు జెప్పబడెను

31. విదితంబీ యుద్ధంబు విశ్వమున వినుడి సుజనులార
వేడుకలాదవు నావ్యలాగ, వెలమితో దేవి బ్రోచుచాల
పదపడియిది నవరాత్రిపండుగై బరగె పుడమిమీద
సాంబా బరగె పుడమిమీద

32. యీవార్తలు నలువయినలినాక్షునకు విలసితముగ దెలిసి
దేవిచెసత్కృపయును వడసి, దిరముగ తేజంబును నొంది
విజయులు నైవిహరించిరిగాన విజయదశమియయ్యెన్
సాంబా విజయదశమియయ్యెన్

33. శూరమితో యీదేవిచరిత్రము కోరికలర వేగ
జదివిన ధీరులకును బాగ, జయంబును గలుగును సుస్పష్టముచాల
ధారుణిలో గుడిపూడి పూర్ణకవి రచియించెను బాగ
సాంబా రచియించెను బాగ

రక్తాసురవధ సంపూర్ణము.

